*e-book series- 03*




# మినీ మిరపకాయలు

## మినీ కవితలు

---

డా॥ తలతోటి పృథ్విరాజ్




**INDIAN HAIKU CLUB PUBLICATIONS**

Faith Home, Sai Colony, Kotturu Panchayathi Road

ANAKAPALLI-531001, Visakhapatnam Dist. ANDHDRA PRADESH, INDIA.

talathotiprithviraj@gmail.com - 9963299452

www.litt.in www.talathoti.in

http://indianhaikuclub.blogspot.com

# మినీ మిరపకాయలు (మినీ కవితలు)

- డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్.

ప్రచురణ :
3 మార్చి 2020 .

ప్రచురణ కర్త :
ఇండియన్ హైకూ క్లబ్ ప్రచురణలు,
అనకాపల్లి-531001. ఆంధ్రప్రదేశ్.

చిరునామ:
డా॥తలతోటి పృథ్వీరాజ్
ఇండియన్ హైకూ క్లబ్,
ఫెయిత్ హోమ్, సాయినగర్,
కొత్తూరు పంచాయితీ ఆఫీస్ రోడ్డు
అనకాపల్లి- 531 001.



డా॥ తలతోటి పృథ్వీరాజ్,
తెలుగు అధ్యాపకుడు,
ప్రభుత్వ డిగ్రీకళాశాల,
పెరుమాళ్ళపురం. తూర్పుగోదావరి జిల్లా.

ముఖచిత్రం, చివరిపేజీ డిజైనింగ్ మరియు డి.టి.పి. :
డా॥తలతోటి పృథ్వీరాజ్.
చరవాణి: 8074004711.
వాట్సాప్: 9963299452.




# జ్ఞాపకాల దొంతరలు

సంవత్సరాలు కళ్ళముందు కరిగిపోతున్నాయి... జారుకుంటున్నాయి... ఆశ్చర్యం వేస్తుంటుంది! కాలం అద్భుత శిల్పి. సుఖదు:ఖాల సమ్మేళనంలో ఎవరి జీవితమైనా ఎప్పటికైనా ముగియాల్సిందే! "లోకులందరూ పోవలసిన మార్గమున నేను పోవుచున్నానని " బైబిల్లో- దావీదు అనినట్లు అందరూ గతించాల్సినవారే! "పోయినోళ్ళందరూ మంచోళ్ళు. ఉన్నోళ్ళు పోయినోళ్ళ తీపిగురుతులు" అని మనసుకవి ఆత్రేయ అంటారు. అంతేకాదు; పోయినోళ్ళుకూడా ఉన్నోళ్ళ తిపిగురుతులే అనిపిస్తుంటుంది. అందుకే ఈ స్మృతులపరంపరలు. జ్ఞాపకాల దొంతరలు. ఆ జ్ఞాపకాలే ఆత్మీయులను ఆయా సందర్భంలో గుర్తుకు తీసుకొస్తాయి. కంటిని తడిచేస్తాయి. మనసును బరువుచేస్తాయి. కాసేపు జ్ఞాపకాలను నెమరు వేయిస్తాయి. అన్నగా...తోడబుట్టిన వాడిగా ఒకటిగా ఎదిగిన మా బాల్యజ్ఞాపకాలనెన్నింటినో తలపోస్తూ...



నా అశ్రుబిందువులనే
కవితాక్షరాలుగా చేసి
నా అన్నయ్య
కీ. శే. శ్రీ తలతోటి కోటేశ్వరరావు
(మాణిక్యరావు)గారికి
ఈ "మినీ మిరపకాయలు
(మినీ కవితాసంపుటి)""గా
అంకితం

-డా॥తలతోటి పృథ్విరాజ్



# నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు...

- డా॥ తలతోటి పృథ్విరాజ్

బలమైన భావాన్ని అంతే బలంగా పాఠకులకు చెప్పగలిగే కవితా ప్రక్రియ మినీ కవిత. నాకు నచ్చిన కవితా ప్రక్రియల్లో మొదటి ప్రాధాన్యతను, మొదటి స్థానాన్ని నేను మినీ కవిత్వానికే ఇచ్చాను. అంతగా మినీ కవిత్వాన్ని అభిమానిస్తాను. అలిశెట్టి ప్రభాకర్, ఆసు రాజేంద్ర, వసుధ బసవేశ్వరరావు, శింగంపల్లి అశోక్ కుమార్‌ల మినీ కవితలు బాగా ఆకట్టుకున్నాయి. అద్భుతం అని తలాడించేలా చేసే ఒక్క మినీ కవిత ఉన్నా ఆ కవికి అంతకుమించి ఏమికావాలి.

1990 తర్వాత హైకూ,నానీలు,రెక్కలు అనే కవితా ప్రక్రియలు ఏవిధంగా అనేకమందిని ఆకర్షించి కవులుగా రూపొందేలా చేశాయో, అదేరకంగా 1970వ దశకంలో అనేకమంది పాఠకులను ఆకర్షించి, ఔత్సాహిక కవులుగా కలాన్ని పట్టించి కవులుగా మలిచి నిలబెట్టిన కవితా ప్రక్రియ మినీ కవిత.

ఆరుద్రగారు చెప్పినట్లు ఎన్నిగజాలు రాశావన్నదికాదు; ఎన్ని నిజాలు చెప్పావన్నదే ముఖ్యం ఏ కవిత్వంలోనైనా! డా॥సి.నారాయణ రెడ్డిగారు చెప్పినట్లు మినీకవిత ఆయుస్సు మెరుపంతైనా; అది కాలమంతా ప్రసరిస్తుంది. నిజమేకదా! 50 సంవత్సరాల తర్వాతకూడా మినీకవిత్వంగూర్చి, ఉదాహరణగా అద్భుత మినీకవితలను ఉదహరిస్తున్నామంటే అది మినీకవిత్వం యొక్క గొప్పతనం. మినీకవితా ప్రక్రియను భుజానకెత్తుకుని సాహితీలోకంలో ఊరూరా ఊరేగించిన మహనీయులు అనేకుల్లో గురుతుల్యులు డా॥ అద్దేపల్లి రామమోహనరావు గారు ఒకరు. వారి మరణంతో లఘు కవితా ప్రక్రియలు చిన్నబోయాయి. ఈ సందర్భంగా వారికి నా నివాళి.

సంప్రదాయ పద్యకవులనుండి, వచన కవులనుండి ఎన్ని విమర్శలు వచ్చినా కాలపరీక్షకు నిలిచి అన్నింటిని అధికమించి పాఠకుల మనసుల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్న ప్రక్రియ నానీ.

సాహిత్యంలో అది పద్యమైనా, గద్యమైనా, వచన కవితైనా, దీర్ఘకవితైనా, గేయమైనా, గాథైనా...మరేదైనా "వాక్యం రసాత్మకం" అన్నట్లు ఉండాలి. లెక్కకు వంద లైన్ల కవితైతేమిటి, వెయ్యిపేజీల నవలైతేమిటి? పాఠకుడ్ని కదిలించగల , ఆలోచింపజేయగల ఒక్క వాక్యం చాలు!

నిడివినిబట్టి కవిత్వాన్ని తూచే తప్పుడు తూకాల తక్కెట్లను విరిచెయ్యండి... తుప్పల్లో విసిరెయ్యండి.

కవి అనేవాడు వాచ్‌మెన్. సమాజాన్ని కాపలాకాసే కాపలాదారుడు. కీడు, చేటు కలిగించే ప్రతిదాన్ని గమనిస్తూ, ప్రమాదాన్ని పసిగట్టి తన జాతిని ఎలా హెచ్చరిస్తూ ప్రాణాపాయంనుండి మిగతా జంతువులను ఎలా హెచ్చరిస్తాయో అలా తన కవిత్వంతో హెచ్చరిస్తూ మానవ జాతిని చైతన్యపరుస్తూ గొప్పబాధ్యతను నిర్వర్తిస్తాడు కవి. అందుకే ఇటువంటి కవిత్వంలో సమాజం

కనిపిస్తుంది. లోకం పోకడ కనిపిస్తుంది. హెచ్చరికలు కనిపిస్తాయి. సమాజంలోని సంఘర్షణలు, అంతరాలు కనిపిస్తాయి. పాలకుల తప్పటడుగుల్ని హెచ్చరిస్తాడు.

కవి కాపలాదారుడుగా మాత్రమేగాక, సంఘపెద్దగా వ్యవహరిస్తాడు. ఆచార సంప్రదాయాలలోని లోపాలపై...మనుషుల ఆలోచనా విధానంపై స్పందిస్తాడు. తన కవిత్వంతో ఆలోచింపజేస్తాడు. సరిజేసే ప్రయత్నం చేస్తాడు.

ఈ నా సంపుటిలోని ఒకో కవిత ఒకో మిరపకాయ. ఆకారరీత్యా పెద్దగా ఉండి సహజగుణమైన మంటవేసే గుణంలేని బజ్జీమిరపకాయలుగా కాక;చిన్నగా, పొట్టిగా ఉండి మంటపుట్టించే మిరపకాయలువంటివి ఈ కవితలు. కొరికితే మంట తట్టుకోలేరు. అందుకే మినీ మిరపకాయలు అని ఈ సంపుటికి నామకరణ చేశాను.

ఇందులోని కవితలన్నీ వర్తమాన దేశ కాలమాన పరిస్థితులను గమనిస్తూ, రాజకీయ పరిణామాలను గమనిస్తూ నా సామాజిక మాధ్యమాలలో స్పందిస్తూ రాసినవే!

ముక్కుమీద గుద్దినట్టు చెప్పడమే నా తత్వం! కొందరు నాకు ఉచిత సలహా ఇచ్చినట్లు, వారు చెప్పినట్లుగా నేను నాజూగ్గా మాట్లాడడం చేయలేను. అందుకే యధార్థవాది లోకవిరోధి అన్నట్లు అయాను. ఇదే తత్త్వం, గుణం నా కవిత్వంలోకూడా కనిపిస్తుంది. ఎవరైనా ఎమైనా అనుకుంటారనుకుంటే "ఇ(నా)న్ సెక్యు(లర్)రిటీ" అనే కవిత్వం రాసేవాడినే కాదు. "వేరువేరయా" అనే కవిత అవినీతిపరులను-దగాకోరులు-అన్యాయస్థుల తత్వాన్ని పరిశీలించి రాసింది. "అన్యోన్య దాంపత్యం" ఆడదని మరచిపోయి మగాళ్ళపై ఆధిపత్యం చెలాయించాలనుకునే ఒక శిఖండి జీవితాన్ని పరిశీలించి రాశాను. మాజీ మంత్రి నారాయణ కొడుకు కారు ఫిల్లర్‌కు ఢీకొట్టి చనిపోయినప్పుడు మీడియా చేసిన హడావిడికి స్పందించి రాసినది. "అంట్లవేధవలు" కుల దృక్పథం చావని సన్నాసులు, చవటల తత్త్వాన్ని అర్థంచేసుకుని రాసింది. ఇలా ఒకో సందర్భంలో ఒకో కవిత పుట్టింది.

మినీ కవిత్వం రాసిన ప్రతి కవి కనీసం రాజకీయాంశానికి సంబంధించిన ఒక మినీ కవితైనా రాయకుండా ఉండడు. నేనూ అంతే! 1998 ప్రాంతంలోనే "నల్లదొరలు" అనే దీర్ఘకవితా సంపుటిని రాశాను. రాజకీయాంశాలకు సంబంధించిన అనేక విషయాలపై కవిత్వం రాశాను. ఈ(ఇ)-సంపుటిలోకూడా ఎన్నో రాజకీయ కవితలు చోటుచేసుకున్నాయి.

రాజకీయాలలో ఉన్నవారు భుజాలు తడుముకోవాల్సిన అవసరంలేదు. కారణం పార్టీలు మారడం తెగిడిన నోటితోనే పార్టీ అధినేతలను పొగడడం ఇటువంటివన్నీ ప్రజలు వినీవినీ సర్వసాధారణమైన రాజకీయ నీతిగా, సూత్రంగా అంగీకరించారు. మినీకవిత్వానికి అతి ప్రధాన వస్తువు రాజకీయ రంగం. గతంలో "రాజకీయ వ్యంగ్యాస్త్రం-మినీ కవిత" అనే చక్కని వ్యాసం నేటినిజంలో ప్రచురింపబడినది.

ఏది ఏమైనా నా జీవితంలో ఊహించని పరిణామాల నడుమ ఆగిన సాహితీ ప్రయాణంలో ఎప్పుడో రాసి ఎన్నో కవితలు... ఇప్పటికీ అప్పుడప్పుడు రాస్తూ ఉన్న ఇటువంటి కవితలు ఇలా ఆధునిక రూపంలో ఈ-బుక్ గా తీసుకురావడం సంతోషంగా ఉంది. మీకు తెలిసిన మీ మిత్రులు, శ్రేయోభిలాషులు, సాహిత్యాభిమానులకు షేర్‌చేస్తే చాలు. కవిత్వం చదివి మీ స్పందన తెలియజేస్తే చాలు! ధన్యుడ్ని. ధన్యవాదాలతో!

-డా॥తలతోటి పృథ్విరాజ్



## కృతజ్ఞతలు

ఎందరినో పాత్రికేయులుగా మలిచి పత్రికా రంగానికి అందించిన అత్యుత్తమ ఆచార్యులు. అన్నింటికి మించి రక్తసంబంధం లేకున్నా ఎందరికో అన్న... ఆత్మీయతతో! అడిగిన వెంటనే నా కవితాతత్త్వం గూర్చి ఆత్మీయ వాక్యాలు రాసి పంపించిన ఆచార్య పి.బాబీ వర్ధన్ అన్నకు ప్రత్యేకమైన కృతజ్ఞతలు.



## త్వరలో రానున్న పృథ్విరాజ్ ఈ-బుక్స్

**01) పృథ్వి కూనలమ్మ పదాలు.**
**02) అనకాపల్లి హైకూలు**
**03) అరకు హైకూలు**
**04) సీతాకోక చిలుక హైకూలు**
**05) సాహితీ హైకూలు**
**06) అరకు హైకూలు**
**07) సూర్యోదయ హైకూలు**
**08) పృథ్వి హైబున్**
**09) పృథ్వి హైగా**
**10) పృథ్వి ఫోటో హైకూ-2**
**11) 'ఇల్లు' దీర్ఘకవిత**

మరెన్నో...





# వేరు వేరయా...!

నీతంటే అవినీతికి భయమే!

న్యాయమంటే అన్యాయనికి

అదురే!!

కాని అదేంటో

లోకం

నీతిని కోరుతోంది;

అవినీతిని అనుసరిస్తోంది.



న్యాయం కోరుతోంది;

అన్యాయంగా నడుస్తోంది.





# అన్యోన్య దాంపత్యం!

భర్త నోరే లేనోడు...

ఆయనిది

మాటల పథ్యం!

భార్యనోరు పెద్దది.

ఆమెది

ఆధిపత్యం!!







# లోకం 'పోకడ'

పోయినోడి మంచిగూర్చి

ఆరోజే

తలపోస్తారు!

ఆ మరుసటి రోజునుండి

చెడుగూర్చే

తవ్విపోస్తారు!!







పిల్లర్ ప్రమాదం.
దేశ సమస్యలను విడిచి
ప్రమాదంలో
ప్రజాస్వామ్యపు
నాలుగో పిల్లర్







# అంట్ల వెధవలు

వేరువేరు జాతికొమ్మలకు

అంటుకడుతూ

ఒకటి చేస్తున్నారు!

కాని అదేంటో...



ఒకే జాతి మనుషులకు

'అంటు'గడుతూ

వేరుచేస్తున్నారు!!





# సామాజిక వర్గం
## అలియాస్
# కులం

పలుకులోనే
క్రొత్తదనాన్ని కోరుకుంటున్నాం
నిర్మూలనలో
పాత పంథానే అనుసరిస్తున్నాం.
'సామాజికవర్గం' పదం
'కులం' పర్యాయపదమై కూర్చుంది!







# 'సారా'ంశం

అన్నలు ఆలోచించాల్సింది
మందుపాతరలు అమర్చి
బలిగొనడం గూర్చి కాదు;
బడుగుల్ని బలిగొంటున్న
' 'మందు' పాత్ర' గూర్చి...







బాధ కలిగించినా
ఉద్యోగ బాధ్యతగా
తలారి!

దోపిడీ అని తెలిసినా
స్వలాభమే పరమావధిగా
దళారి!!







# జడ్జిమెంట్

ప్రాచీన భారతంలో

పద్దెనిమిది పర్వాలు!

న్యాయ భారతంలో

ఎడతెగని వాయిదా పర్వాలు!!







# అసార్ధక నామధేయులు

రక్షక భటులు...

అవినీతి నిరోధక శాఖ...

న్యాయస్థానం...







# హ్యూమనిస్ట్

ప్రాణాలు తీసే

ఫ్యాక్షనిస్ట్ కాదు...

ఆశపెట్టి జెండాపట్టించి తిప్పుకునే

కమ్యూనిస్ట్ కాదు...

ఆడాళ్ళ హక్కులు గూర్చి మాట్లాడే

ఫెమినిస్ట్ కాదు...

హింసిస్తూ ఆనందించే



శాడిస్టూ కాదు...

..............

లోకంలో విలువే లేనోడిలా





# కట్టల పాములు

బ్యాంకుల్లో
వందల కట్టలే లభ్యం!

పెద్దనోట్లన్నీ
పెద్దోళ్ళ పుట్టల్లో
సౌలభ్యం!!







# కార్పో'రేట్'

పేరులోని

విలువను పసిగట్టలేక

తీరా... చేరాక,

గగ్గోలు పెడుతున్నారు

విద్యాలయాలలో...

ఆసుపత్రుల్లో...







# 'మన'స్వభావం

దేవుడి గుడి
రోడ్డు మధ్యలోనైనా సరే
ఎవరికీ అడ్డులేనట్లు...!

దరిద్రుడి గుడిసె
రోడ్డుప్రక్కనైనా సరే
ఎందరికో అడ్డన్నట్లు!!







# ఇ(నా)న్ సెక్యు(లర్)రిటీ

నడిరోడ్డుపై
దేవాలయాలేగాని
మసీదులు, చర్చీలు కాదు.

అవును
ఇది హిందూ దేశమే!
ఎవడ్రా కూసింది
సెక్యులర్ దేశమని!!







# షరామామూలే...

నిన్న చీపురు కట్లతో...
నేడు ఎర్రబుగ్గలతో...
వి.ఐ.పి.ల ఫోటో ఫోజు!
వదలని సమస్యల బూజు!!







# అబ్రకదబ్ర

నిన్నదిదాక

నగరం నిండా చెత్తా చెదారం!

తెల్లారికల్లా

తుడిచిన అద్దం!!

–ఈరోజు మంత్రి పర్యటన !!!







# మంత్రిదాదా ఎం.బి.బి.ఎస్.

నాడు

డెంటల్ డాక్టర్‌గా

రాణించలేదు

పన్ను పీకడం రాక!

నేడు



ఆర్థిక మంత్రిగా

రాణిస్తున్నాడు

వరుసపెట్టి 'పన్నులు' పీకుతూ...





# థింక్ బిగ్

సినిమావాళ్ళను చూసి
నేర్చుకోరేం...!
ఎన్ని పెళ్ళిళ్లైనా...
ఒకతల్లి బిడ్డలు కాకున్నా...
ఎంత అన్యోన్యంగా ఉన్నారో!

వీళ్ళెందుకో

బంధాలు తెంపుకుంటూ
బతుకు జట్కాను నడిపిస్తున్నారు
రచ్చబండకెక్కుతున్నారు!!





# అయ్యో బాబూ...

నీది
పదవుల పలుకుబడిని బట్టి
హెచ్చుతగ్గుల షేర్‌మార్కెట్‌లాంటి
గౌరవం.

నాది
పెదవుల పలుకుల్నిబట్టి
'షేర్'లా నిలిచే
ఆత్మగౌరవం.







## వ్యూహం

పెట్రోలు ఉంటేనే
ముందుకు వాహనాలు!

పథకాలు ఉంటేనే
ప్రజల్లోకి అధికార పార్టీ!



మండే గుణం పెట్రోలిది!
దండే గుణం పార్టీలది!!





# అధికార పార్టీ

అనధికారిక కార్యక్రమాలకూ

కోట్ల ఖర్చు !

ప్రజాధనం ఖాతాలోనుంచే

అధికారికంగా!!







# ఫ్లెక్స్-బుల్-లీడర్స్

గెలిచాక

ముఖం చాటేసిన నాయకులు

నియోజకవర్గ ప్రజలకు

అప్పుడప్పుడు ప్రత్యక్షం

టి.వి.ప్రత్యక్ష ప్రసారాల్లోనో...!

శుభాకాంక్షల ఫ్లెక్సీలతోనో...!!







# పొత్తు పెటాకులు

నాడు

అన్యోన్యపు జంటలా

ఒకరినొకరు

హత్తుకున్నారు పొత్తులతో!

నేడు

అనుమానపు దంపతుల్లా



ఒకరికొకరు

కత్తులు దూస్తున్నారు

ఎత్తులతో!!





కషాయమై

లౌకికదేశం గొంతుకలో

దిగజారలేక

కాషాయం!







# నూతన ప్రభుత

పురిటినొప్పుల్తో
క్రొంగొత్త పార్టీల ప్రసవవేదన
పొత్తిళ్ళలోనే!
మౌనముద్రలో కొన్ని పార్టీలు.
ఎత్తుల పొత్తులతో
ఇంకొన్ని పార్టీలు.
మంత్రసాని పాత్రలో
ఎన్నికల సంఘం!!
బలహీనంగాపుట్టి
బాలారిష్టాలతో
సంకీర్ణ శిశువు!







# కొండను తవ్వి...

పెద్దనోట్ల రద్దు
మరింత పెద్దనోట్ల గుద్దు.
మునుపటిలా దరిమల
వెలుగులోకి నకిలీనోట్లు
సామాన్యలకు తప్పని పాట్లు
తరగని రేట్లు
పెరిగిన పన్ను పోట్లు
బడాబాబు నల్లదనం ఘనం.



కొండను తవ్వారు...
కానీ
ఎలుకనుకూడా పట్టలేదు!





# జంపింగ్ జిలానీలు

పదవి ఎరతో

ఆశల గేలానికి చిక్కిన

నాయకుడు!

పొగిడిన నాయకుడ్నే

తెగుడుతూ బలిసిన

మాయకుడు



సాకుల పోపుసామాను మాటలతో

పార్టీ ఫిరాయింపు

రాజకీయ తాలింపు!!





# పరస్పర అవసరం!

"సీటిస్తే నీ పార్టీలోకి వస్తా !..."
"సీటిస్తా 'రా!' నా పార్టీలోకి !"

...........

తిట్టినన్నాళ్ళు తిట్టి
చేరినవాడూ సిగ్గపడట్లేదూ...

తిట్టినవాడ్ని చేర్చుకున్నవాడూ
సిగ్గుపడట్లేదూ...



జైజైలు కొట్టే అనుచరగణాలూ
సిగ్గుపడట్లేదూ....





# గమ్మత్తు

మత్తుకోసం
'ఆ' 'పార్టీ'లలో 'ఆ'తీర్థం!

అధికార మత్తుకోసం
కొత్తపార్టీ తీర్థం!!







# నాన్సెన్స్

ఒకప్పటి సైకిల్ కు

లైసెన్స్!

ఇప్పటి సైకిల్ కు

నో 'సెన్స్'!!







# స్వార్థం తీరు

కరుణిస్తే

క్షీరాభిషేకాలు!

నిరాకరిస్తే

దిష్టిబొమ్మ దహనం!!







# నిరంతరాయంగా...

స్వాతంత్ర్య వేడుకల్లో
కోటపై కోటలుదాటే
నాయకుల సఖ్యాతా సందేశం!

కుతంత్రాల పాలనల్లో
కోట్లపై నిరుద్యోగిత సంఖ్యదాటే
ప్రజల సందేహం!!







వెలవెలబోతోంది
జెండా పండుగ!

రెపరెపలాడుతోంది
జెండాల పండుగ!!

ఎన్నికల కాలం.
రాజకీయ కర్షకుల
స్వల్పకాల వాణిజ్యపంట!!!







# జానాను...

దేశం

అభివృద్ధి చెందుతోంది.

కార్పోరేట్ ఎం.పి. అయ్యాడు!

రైతు

కూలీ అవుతున్నాడు!!







# 'చీప్' గెస్ట్

ఫ్లెక్సీలతో
మంత్రికి ఘనస్వాగతం!

పర్యావరణ సదస్సుకు
ఆయనే ముఖ్య అతిథి!!







# ఎన్ని'కల' కోడ్

నాయకుల విగ్రహాలకు

తొడిగారు ముసుగులు!

వినాయకులు నిగ్రహానికి

తొలిగించారు ముసుగులు!!





## డా॥తలతోటి పృథ్వీరాజ్ హైకూ సంపుటాలు
















## డా॥తలతోటి పృథ్వీరాజ్ పరిచయం చేసిన వినూత్న కవితా ప్రక్రియలు







## డా॥తలతోటి పృథ్వీరాజ్ సంకలన కర్తగా ప్రచురించిన హైకూ సంకలనాలు







## పృథ్వీరాజ్ దీర్ఘకవితా సంపుటాలు







## పృథ్వీరాజ్ పరిశోధనాత్మక వ్యాస సంపుటాలు







## పృథ్వీరాజ్ నానీ సంపుటి



## పృథ్వీరాజ్ నానీ సంకలనం




## పృథ్వీరాజ్ కవితాత్మక సంపుటి




## పృథ్వీరాజ్ రూపొందించిన ఇ-బుక్స్









## పృథ్వీరాజ్ సంపాదకత్వంలో వెలువడిన హైకూ పత్రికల్లో కొన్ని















## డా॥తలతోటి పృథ్వీరాజ్ రూపకర్తగా,వ్యాఖ్యాతగా రూపొందించిన 250 సాహితీ ఆడియో,వీడియో సాహితీ సీ.డీ.లలో కొన్ని మచ్చుకి...




## డా॥తలతోటి పృథ్వీరాజ్ నిర్వహిస్తున్న వెబ్‌సైట్స్-బ్లాగ్స్



## డా॥తలతోటి పృథ్వీరాజ్ కవితా చిత్రాలు, కార్టూన్స్‌లో కొన్ని



## డా॥తలతోటి పృథ్వీరాజ్ సాహిత్యోపన్యాసకునిగా కొన్ని




## డా॥తలతోటి పృథ్వీరాజ్ సాహిత్య పవర్ పాయింట్ రూపకర్తగా



## డా॥తలతోటి పృథ్విరాజ్ ఇండియన్ హైకూ క్లబ్ వ్యవస్థాపకునిగా నిర్వహించిన కార్యక్రమాల ఫోటోలలో మచ్చుకి కొన్ని



## డా॥తలతోటి పృథ్విరాజ్ ఆత్రేయ సాహితీ స్రవంతి వ్యవస్థాపకునిగా నిర్వహించిన కార్యక్రమాల ఫోటోలలో మచ్చుకి కొన్ని



## డా॥తలతోటి పృథ్విరాజ్ అనకాపల్లి యంగ్ పొయిట్స్, యువతరంగాలు సంస్థల వ్యవస్థాపకునిగా నిర్వహించిన కార్యక్రమాల ఫోటోలలో మచ్చుకి కొన్ని



## డా॥తలతోటి పృథ్విరాజ్ సాహిత్యకృషిపై దినపత్రికల్లో ప్రచురింపబడిన వ్యాసాలలో కొన్ని



టాలెంట్ షో

సాహిత్యమే శ్వాసగా పృథ్విరాజ్

సాంకేతిక సాహితీ సౌరభం..

ప్రయోగాల కృషి

## డా॥తలతోటి పృథ్వీరాజ్ హైకూ కవిత్వంపై జరిగిన పరిశోధనలలో కొన్ని


Dr. THALATHOTI PRIDHVIRAJ
KALUVALU - PARISEELANA

By

Supervisor


పృథ్వీరాజ్ కవిత్వంపై పరిశోధనలు


తలతోటి కవితలపై పరిశోధనలు

## డా॥తలతోటి పృథ్వీరాజ్ స్వీకరించిన పురస్కారాలు, అవార్డులలో కొన్ని





## డా॥తలతోటి పృథ్వీరాజ్ సన్మాన సత్కారాలలో కొన్ని





## డా॥తలతోటి పృథ్వీరాజ్ సాహితీ ప్రముఖులతో కొన్ని





## డా॥తలతోటి పృథ్విరాజ్ ఆకాశవాణి, విశాఖపట్నం కేంద్రంలో కవితా పఠనం



*www.youtube.com* లో *kavitalathoti* పేరుతో

వందలాది సాహితీ వీడియోల ముఖచిత్రాలలో కొన్ని...

*Dr Talathoti Prithvi Raj, 8074004711, Whatsapp:9963299452 www.talathoti.com www.litt.in*



**ఆచార్య పి.బాబీవర్ధన్**
జర్నలిజం, మాస్ కమ్యూనికేషన్ శాఖ,
ఆంధ్ర విశ్వ విద్యాలయం,
విశాఖపట్నం.

## మినీ కవితల మనోనేత్రం 'పృథ్వి'



డాక్టర్ పృథ్విరాజ్... పొట్టి కవితలకు గట్టి చిరునామా! సమాజాన్ని తేరిపార చూస్తాడు. స్పందిస్తాడు. రాసిన ప్రతిసారి అక్షరాల్ని ఆయుధంలా సంధిస్తాడు. సమాజంలోని కుళ్ళు, కుతంత్రాలను ఏకిపారేస్తాడు. తరాల అంతరాలను పీకి పాతరేస్తాడు. తన కవితల్లో తొంగిచూసే పోలికలు పొలికేకలవుతాయి. పృథ్వి మార్పుకోసం రోజూ తూర్పుని చూస్తుంటాడు. అదే వేకువ, అదే సంధ్య... పీడితవర్గాల పిడికిలి అవుతాడు. ఆధిపత్యపు గుంట నక్కల కూతలకు సింహమై ఫీంకరిస్తాడు. ప్రశ్నించే గొంతుకల ఏకస్వరమై ప్రతిధ్వనిస్తాడు. ప్రశ్నించే గొంతుకలకు తర్ఫీదునిస్తాడు. చీకట్లను ఛేదించే మెరుపుతీగవుతాడు. రాసింది చదివిస్తాడు. చదివేలా రచిస్తాడు. అందుకే అక్షర సేద్యంలో పృథ్వి అనితర సాధ్యుడు. 'అసాధ్యుడు'.

**– ఆచార్య పి.బాబీవర్ధన్**

